(రుద్రాక్ష గ్రంథమాల - 4)

# శివ-లింగం



(రచయిత)

యస్.పి.యల్. ప్రసాద్

దైవజ్ఞ శిరోమణి

# విన్నపము - ధన్యవాదములు

లోగడ నేను వ్రాసిన పుస్తకములకు మంచి స్పందన లభించింది. అదే స్పూర్తితో మరికొన్ని పుస్తకములు వ్రాయ సంకల్పించి, తర్వాత ఆ ఆలోచనను విరమించుకొంటిని. దానికి మొదటి కారణము ద్రవ్యలోటు. రెండవది పూర్వపు మనవారివలె కోరుకుదుబడని వ్యాఖ్యలు, గ్రాంధిక భాష, సంస్కృత శ్లోకములతో పెద్ద పెద్ద పుస్తకముల కంటే, ఇదే విధముగా చిన్న సైజులో లఘువుగా ఏదో ఒక ఉపయోగకరమైన విషయము గూర్చి చర్చించుట. మూడవది దాతలకు పెద్ద బరువు కల్గించక వారి అందుబాటులో ముద్రించి, ఉచిత ప్రతులను అందరకూ అందజేయుట.

పరమేశ్వరుని కృప వలన ఈ రోజులలో కొందరు పిల్లలకు మంచి జీతములతో గూడిన ఉద్యోగములు లభించుచున్నవి. మనవారిలో చాలామంది పిల్లలు విదేశములలో ఉద్యోగములు కూడా చేయుచున్నారు. శైవాభిమానము గల్గిన దాతలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన, ఇదే విధముగా అనేకానేక విషయములను సరళభాషలో ఉచితముగా అందించగలము. నా ఆవేదనను, విన్నపమును స్వీకరించి దాతలు తగిన చేయూత నీయగలరు. నా చిరునామాపై గానీ, ఫోనులోగానీ సంప్రదించి శివకృపకు పాత్రులు కాగలరు.

ఈ చిరు పుస్తకమును, వారి నాన్నగారు కీ.శే. శివశ్రీ ముదిగొండ బసవయ్య (నామాతామహులు) గారు, తల్లి కీ.శే. శ్రీమతి సుందరమ్మ (నా మాతామహి) గార్ల జ్ఞాపకార్థం ముద్రించినవారు శివశ్రీ డా. ముదిగొండ సదాశివరావు (మా ఆరవ మేనమామ) గారు. వారు ప్రస్తుతము హైదరాబాద్ గవర్నమెంటు ఆయుర్వేదిక్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తున్నారు. ఆ పరమేశ్వరుడు వారికి, వారి కుటుంబ సభ్యులందరకూ ఆయురారోగ్య ఐశ్వర్యాదులు కూర్చుగాత. వారికి నా ధన్యవాదములు.

శివాభిలాషి

శ్రీ.వం. లింగమూర్తి ప్రసాదు.

# స్మృత్యర్థం



ముదిగొండ బసవయ్య, సుందరమ్మ దంపతులు

ప్రసా - శివ

# 'శివ-లింగం'
## (రుద్రాక్ష గ్రంథమాల - 4)

Cat 10209 ~~22276~~

ప్రథమ ముద్రణ
చైత్ర శుద్ధ పంచమి
(13-4-2005)

ప్రతులు:
1500




ప్రింటెడ్ :
శ్రీ లక్ష్మీ నరసింహ ప్రింటర్స్
ఆర్.కె. నగర్, మల్కాజ్‌గిరి
ఫోన్ : 27244008.

ఉచిత ప్రతి వలయువారు
సంప్రదించండి :

(పుస్తకదాత)
డా॥ ఎమ్.ఎస్. రావు
ఇంటి. నెం. 24-56 శివపురి 3వ వీధి,
ప్రుడెన్షియల్ బ్యాంక్ ఎదురుగా,
ఆర్.కె. నగర్, మల్కాజ్‌గిరి.
సికింద్రాబాద్ - 47.
ఫోన్ : 27242348.

(రచయిత)
యస్.పి.యల్. ప్రసాద్
దైవజ్ఞ శిరోమణి
...33/15, లాబ్ క్వార్టర్స్,
...చన్‌బాగ్, హైద్రాబాద్ - 58.
ఫోన్ : 24340121.

# శివ - లింగం

బహు విశాలమైన శివలింగ సంబంధిత సాహిత్యం టూకీగా చెప్పుట సాధ్యంకాని విషయం. అయినా దీన్ని గూర్చి కొంతవరకు చర్చించుకుందాం.

శివునికి గల ఎన్నో నామాలలో "పశుపతి, లింగము" అనెడి శబ్దాలు తక్కువగా అర్థం అవుతాయి. పశుపతి శబ్దం శివపురాణం, వాయువీయ సంహిత, పూర్వఖండంలో వివరంగా ఈయబడింది. జీవుడు శరీరాన్ని చూడగలడు గానీ, శరీరం జీవుని చూడలేదు. ఈ రెంటిని, వీనికి అతీతంగా నున్నవాడు ఎవడో చూస్తున్నాడు. కానీ ఇవి రెండు అతనిని చూడలేవు. బ్రహ్మ మొదటిస్థావరం దాకా అన్నీ పశువులే అనబడతాయి. ఇవి మాయా జాలంతో బంధింపబడి సుఖదుఃఖాలనే మేతను మేస్తుంటాయి. ఈ పశువుల నాడించే పశుపతి (ఈశ్వరుని) చేతిలోని పశుప్రాణులు జ్ఞానంలేక, తన సుఖదుఃఖాల విషయంలో ఏమియును చేయ సమర్థత లేక, ఈశ్వరుని ప్రేరణచే స్వర్గనరకాలకు పోతుంటాయి.

"లింగ" శబ్దానికి చిహ్నము లక్షణము అని స్థూలార్థం. ఇది ఒక్క శివునికే చరితార్థం. ఇతరములైన దేవతాప్రతిమలు మూర్తులనబడతాయి. ఆకారము, రూపము వ్రాయబడని ఈ 'లింగం' సాంఖ్య దర్శనానుసారం ప్రకృతి వికృతి కూడా అదియే. స్కాంద పురాణంలో 'లయనాల్లింగ ముచ్యతే' అన్నట్లు లయము ప్రళయము సంభవించును గాన 'లింగం' అనబడింది.

సచ్చిదానందమయుడైన పరమాత్మయే శివుడను నామధేయము గల్గి లింగమయ్యెను. "లీనార్థగమకం చిహ్నం లింగమిత్యభిధీయతే" అను ప్రమాణముచే లింగమన్న, తనలో ప్రాణులందరనూ చేర్చుకొను జ్యోతిస్సని తెలియనగును. "లీయతే గమ్యతే యత్ర తల్లింగం" ఎచట ఈ ప్రపంచమంతయు విశ్రాంతినొందునో అదియే లింగమనబడును. సమస్త జీవులు గాఢనిద్రయందు హృదయాకాశమున వెల్గొందు జ్యోతిర్లింగమున విశ్రాంతి నొందుచున్నారు. ఇదే విషయమును శ్రీ కృష్ణభగవానుడు గీతలో అర్జునునకుపదేశించెను. "ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి" ప్రాణులందరి హృదయములలో భగవంతుడు సూక్ష్మమైన జ్యోతిర్లింగముగా నివశించుచున్నాడు.

ఇట్టి పరతత్త్వమగు శివలింగమును పూజించి ప్రార్థించి ధ్యానించుటచే సర్వదేవతా మూర్తులను, సత్పరుషులనారాధించిన ఫలము కల్గునని శివమహాపురాణము తెల్పినది. సగుణము, నిర్గుణమగు పరతత్త్వమును శివలింగముగా భావించి బాహ్యాంభ్యంతరములందు పూజించుట ఇహపరశ్రేయోదాయకము.

శ్లో॥ శివార్చనం రుద్ర జపః ఉపవాసః శివాలయే
వారాణస్యాంచ మరణం ముక్తిరేషా సనాతనీ - (శివపురాణం)

మోక్షమునకు శివారాధన (లింగారాధన), రుద్రాధ్యాయ పఠనము, శివమందిరమున ఉపవాసము, కాశీక్షేత్రమున మరణించుట అనునవి ముఖ్యసాధనములు.

"నిత్యం త్రిసంధ్యం శివలింగ మభ్యర్చ్యమ్" అనెడు ప్రమాణముచే ప్రతిదినము త్రికాలములందు లింగార్చన చేయవలెను. అట్టి అవకాశము లేనివారు కనీసము లింగోద్భవ మహాపవిత్ర దినమైన మహాశివరాత్రి నాడు మాత్రము విశేషముగా ఆరాధింపవలెను.

శ్లో॥ మాఘస్య హ్యసితే పక్షే నిశిష్టా సాతి కీర్తితా
నిశీథ వ్యాపినీ గ్రాహ్యా హత్యాకోటి వినాశినీ (శివపురాణం)

మాఘ మాసమున కృష్ణపక్షమున వచ్చెడు చతుర్ధశి తిథి మిక్కిలి పవిత్రమై భక్తుల కోట్లకొలది పాపములను పోగొట్టును.

శ్లో॥ యత్ఫలం మమ పూజాయాం వర్షమేకం నిరంతరమ్
తత్ఫలం లభతే సద్యః శివరాత్రౌ మదర్చనాత్

ఒక్క సంవత్సరము పాటు ప్రతిదినము శివలింగమును పూజించుటచే కల్గుఫలము మహాశివరాత్రి యొక్క దినముననే ఆరాధించి పొందవచ్చును.

లింగ స్వరూపము జ్వాలామాలావృతమై జ్యోతిః స్తంభముగా గోచరించి భక్తుల మనోరంజనముగా పంచసూత్రఘటితమయ్యెను. లింగము యొక్క ఎత్తు వెడల్పు పొడవు చుట్టు ఒకే కొలత కల్గియుండుట 'పంచసూత్రఘటన' మగును. ఇయ్యది చరలింగమైనచో అఖండము గను, స్థిరలింగమైనచో ద్విఖండముగ నుండవలెను. ప్రాణవట్టము - పిండము ఒకటిగా నుండెడిది అఖండ లింగము. ద్విఖండ మన ప్రాణవట్టముపై అను సంధింపబడు బాణలింగము. ఇట్టి ద్విఖండలింగమును తమ ఇంటిలో పూజించుట కన్న శివాలయమున ప్రతిష్ఠింపబడియున్న దానిని, అంతకంటే గ్రామబాహ్యమున, అద్దానికన్న వనమునందు, అంతకంటే పర్వతముపైన, ఆపై వరుసగా నదీతీరమున, మహానదీ తీరమున, గంగాతీరమున, అన్నిటికంటే మిన్నగా కాశీక్షేత్రమున శివలింగార్చనము క్రమముగా విశేషఫలముల నొసంగును.

మంత్ర తంత్రములు రాకున్ననూ, మనస్ఫూర్తిగా "కాలహర, కంఠహార, దుఃఖహర, దారిద్ర్యహర, సర్వపాపహర, ఓం హర, మృత్యుంజయా, కైలాసవాసా, పార్వతీ

పతే, హరహర మహేదేవ, శంభోశంకర, పాహిమాం, రక్షమాం" యనుచు లింగముపై కొంత నీరు (గంగ) పోసి, భూతినిడి గంధపుష్పాదులనుంచి శరణువేడిననూ, ఆ భోళాశంకరుడు ప్రసన్నుడగును.

వేద శాస్త్రాదులతో సహా సర్వమూ ప్రళయాగ్ని యందు భస్మమై శివలింగమందు లయించుతుంది. తిరిగి సృష్ట్యారంభమున సర్వమూ లింగమునుండియే ప్రకటం అవుతుంది. కనుక 'లయ' శబ్దమునుండి లింగశబ్దం ఆవిర్భవించిందనుట యుక్తము.

"లింగ మధ్యే జగత్సర్వం త్రైలోక్యం స చరాచరం లింగబాహ్యాత్పరం నాస్తి తస్మాల్లింగం ప్రపూజయేత్" సకల చరాచర ప్రపంచ మంతయు లింగమూర్తి యందే నివశించును. లింగ బాహ్య మందేదియు లేదు. అందుచే అట్టి పరిపూర్ణ శివ స్వరూపమును ధ్యానింపదగును. అట్టి లింగమును ధరించి "లింగదేహి సదాశుచిః" అనునటుల లింగధారి సర్వకాల సర్వస్థితుల యందు శుచిగానే పరిగణింపబడుచున్నాడు.

లింగపూజచే పార్వతీ పరమేశ్వరు లిద్దరితోబాటు లింగం మూలమందున్న బ్రహ్మ, మధ్యనున్న విష్ణువు, అగ్రముననున్న ప్రణవస్వరూప పరమశివుడు అందరూ ఏకకాలంలో పూజింపబడతారు. అలాగే ఎక్కువ మహత్యం గల్గిన పాదరస (పారదం) లింగంలో కూడా దేవతలెందరో ఉండటం విశేషం. 'ప'కారంలో విష్ణువు, 'ఆ'కారంలో కాళిక, 'ర'కారంలో శివుడు, 'ద'కారంలో బ్రహ్మ ఉండుటచే జీవితంలో ఏకమాత్రమైనా దీన్ని పూజించిన, ధనం, జ్ఞానం, సిద్ధి, ఐశ్వర్యం లభిస్తాయి.

సర్వత్ర ప్రచారంలో నున్న పార్థివ లింగార్చనేగాక వివిధ ద్రవ్యాలతో నిర్మింపబడే అనేక లింగాలను పూజించిన వేర్వేరు ఫలితాలు కల్గును. గరుణపురాణం, లింగపురాణం (3వ అధ్యాయం), స్కాందపురాణాదులలో వీటి వర్ణనలు విశేషంగా వున్నాయి.

రెండుపాళ్ళు కస్తూరి, 4 పాళ్ళు చందనము, 3 పాళ్ళు కుంకుమ పూవు కలిపి చేసిన 'గంధలింగము'ను పూజించిన శివసాయుజ్యం ప్రాప్తిస్తుంది. అట్లే, పరిమళ భరితమైన అనేక పుష్పాలతో చేసిన 'పుష్పలింగ' పూజచే ఆధిపత్యలాభం, స్వచ్ఛమైన (నేలపైబడని) కపిలగోవు పేడచే నిర్మాణం చేసిన 'గోశకృల్లింగ' పూజచే ఐశ్వర్యలాభం, రజస్సు (ధూళి)చే చేసిన 'రజోమయ లింగ' పూజచే విద్యాధరత్వం లభిస్తుంది. యవలు, గోధుమలు, బియ్యములచే చేసిన 'యమగోధుమ శాలిజ' లింగంచే పుత్రలాభము, పటికబెల్లంచే చేసిన 'సితా ఖండమయ లింగం' చే ఆరోగ్యం 'లవణజలింగం'చే వశీకరణశక్తి, 'తిలపిష్టోత్థలింగం' (నువ్వులపిండి)చే అభీష్ట సిద్ధి, 'తుషోత్థలింగం' (పొట్టు)చే శత్రునాశనం,

'భస్మమయలింగం'చే సర్వఫలప్రదం, 'గూడలింగం'చే ప్రీతి, 'చక్కెర లింగం'చే సుఖం, 'కేశాస్థిమయ లింగ' పూజచే సర్వశత్రునాశనం, 'వంశాంకురమయ (వెదురు మొలకలతో) లింగంచే వంశవృద్ధి, ద్రుమోద్భూత (చెట్టుకొయ్య) లింగంచే దరిద్రనాశనం, 'పిష్టమయలింగం'చే విద్య, 'దధిదుగ్ధలింగం'చే కీర్తి, 'ధాత్రీ ఫల లింగం'చే ముక్తి, 'నవనీత లింగం'చే సౌభాగ్యం, 'ధాన్యలింగం'చే ధాన్యం, ఫలంచే చేసిన 'ఫలలింగం'చే ఫలప్రదం, 'దూర్వాకాండజ' (గరికగడ్డి కాండం) చే అపమృత్యుహరణం, 'కర్పూర కల్పిత లింగం'చే ముక్తి, 'ముక్తామయ (ముత్యం) లింగం'చే సౌభాగ్యం, సువర్ణ రజత నిర్మితలింగాలచే మహాముక్తి లభిస్తాయి. ఇత్తడి, కంచు లింగాలు పరంలో సుఖానిస్తాయి. తగరం, ఇనుము, సీసములచే చేసినవి శత్రునాశనాలు.

'అష్టధాతుమయలింగం' సర్వసిద్ధిప్రదం, 'వైఢూర్యలింగం' శత్రుహరం. 'స్ఫటికలింగం' సర్వకామప్రదం. కానీ, రాగి, సీసం, ఎర్రచందనం, శంఖం, కంచు, ఇనుములతో చేయబడు లింగాభిషేకాలు కలికాలంలో నిషిద్ధాలు. ఒక్క పార్థివ లింగానికి తప్ప తక్కిన లింగాలకు నిర్మాణానంతరం, స్వర్ణపాత్రలోని ఆవుపాలలో 3 దినములుంచి త్రంబకాది మంత్రాలతో శుద్ధిజేసి, వేదికమీద పార్వతీదేవికి షోడశోపచారాలాది అనేక విధులతో సంస్కారం చేయాలి. ప్రాణప్రతిష్ట చేయాలి. సాధారణంగా అంగుష్ట పరిమాణంలో (పాషాణాది లింగాలకు వర్తించదు) లింగాన్ని నిర్మించాలి. లింగం కంటే రెండురెట్ల పరిమాణంలో వేదిక, దానిలో సగం పరిమాణంలో యోని పీఠమేర్పరచాలి. లింగం యొక్క పొడవు తగ్గితే శతృవృద్ధి. యోనిపీఠం, మస్తకాదులు లేక చేసిన లింగనిర్మాణం మంచిది కాదు.

కళ్ళు మూసుకుని అర్ధనిమీలిత నేత్రుడై మనస్సు, శరీరం, ఆత్మ ఒక్క క్షణమైన ఏకాగ్రతం చేసి మన భృకుటి మధ్య ఆ శివలింగ స్వరూపాన్ని దర్శించగలిగితే మన పూర్వులు ప్రతిపాదించిన, చెప్పాలనుకున్న, చూపించాలనుకున్న ప్రతి అక్షరం, ప్రతి దృశ్యం దాని గమ్యాన్ని చేరినట్లే. మనను రక్షించుచున్న ధర్మము నిలిచి మానవుడు శాంతికాముడు కావలెనన్న ఈ కర్మభూమిన ఆస్తిక మార్గమే శరణ్యము. తద్వారా ఇహమున శాంతి సౌఖ్యముల నొందుటే గాక, పరమున పరమేశ్వరుని పొందవచ్చును. నిష్ఠగా నియమ బద్ధమగు శివలింగార్చనచే ఐహికాముష్మికములను సాధించిన వారెందరో మన చరిత్రయందు గలరు.

శ్లో॥ మహాలింగార్చనస్యాస్య సదృశం నేహ కించన

మహా లింగార్చనతో సమానమైన వ్రతము ఈ జగమున మరొకటి లేదు.

శ్లో॥ యజ్ఞో దానం తపశ్చైవ సర్వం సాంత ఫలం స్మృతం

మహాలింగార్చనం త్వేత దనంత ఫలదాయకమ్॥

మహాలింగార్చనచే కలుగు ఫలమనంతము, ఎన్నటికిని నశించనిది. యజ్ఞ, యాగ, దాన, తపస్సులచే కలుగు పుణ్యము శాశ్వతముగాక, కొంత కాలమునకు నశించునని తెలియుచున్నది.

శ్లో॥ యం యం కామయతే మర్త్యో లింగార్చన పరాయణః

తం తమాప్నోతి దేవేంద్ర మత్ప్రసాదాన్న సంశయః

లింగార్చన మొనర్చు మానవుడు తన మనమందే కోర్కెలను కోరునో, నాయనుగ్రహముచే వానిని తప్పక పొందగలడు" అని శివుడే సెలవిచ్చెను.

శ్లో॥ భూత ప్రేత పిశాచాద్యాః కూష్మాండా బ్రహ్మరాక్షసాః

మహాలింగార్చనం దృష్ట్వా పలాయంతే న సంశయః

భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసులు, మహాలింగార్చనను జూచి పారిపోవుదురనుటలో ఎట్టి సందేహము లేదు.

శ్లో॥ గృహేత్వేక గుణం ప్రోక్తం, నదీతీరే సహస్రకం

దేవతాయతనే లక్షం శతలక్షం హరేర్గృహే

శివాలయే కోటిగుణం స్వయంభూ స్వన్యథా పునః

అనంతం పూజనం శంభోః బుధం పచ్చ ద్విజోత్తమ॥

లింగార్చన ఫలము స్థల భేదము వలన అధికమగు చుండును. ఇంటిలో లింగార్చనచే ఒక భాగము ఫలము. నదీ తీరమున పూజించిన వేయిరెట్లును, దేవతా నివాసములందు అర్చించిన లక్షరెట్లు, విష్ణ్వాలయమున పూజించిన నూరు లక్షల గుణంబులు, శివాలయమందర్చించిన కోటి రెట్లు, పర్వత గుహలతో పూజించిన పదికోట్లరెట్లు, ఆ గుహ బుష్యాశ్రమమైనచో కోటికోట్ల రెట్లుగా లింగార్చన ఫలము కలుగును. బ్రహ్మక్షేత్రమున శివార్చనొనర్చిన అపరిమితమగు ఫలము కలుగుట నిశ్చయము.

"శాసనాత్ శాస్త్ర ముచ్యతే" - శాసించేది శాస్త్రం. శబ్దశక్తే మంత్రం. సంకల్పశక్తియే ధ్యానం. ఫలము మనము ఆదరించెదు మంత్రజప, ధ్యాన, భక్తి, శ్రద్ధలపైన ఆధారపడి యుండును.

రసాది గుణములు కలిగిన బంగారు, వెండి, రాగి, ఇత్తడి, పంచలోహములతో కూడిన లింగార్చన కంటే పార్థివ లింగ పూజచే కూడా విశేషమైన ఫలితములు కలుగును.

శ్లో॥ మృత్తికా ఘనసారంచ ద్వయోః సమ్మేళనం కృతం

మహాలింగం సమభ్యర్చ్య సంపత్తి ర్దివసావధి

మోహనం తత్క్షణాదేవ కరిష్యతి న సంశయః

మన్ను, శ్రేష్ఠమైన గంధము మిశ్రమము చేసి నిర్మించిన మహాలింగమును భక్తితో ఒక దినము పూజించిన, అది సంపదనిచ్చి ఆ క్షణముననే సంపదయందు అనురక్తులుగా చేయుటలో సందేహము లేదు.

శ్లో॥ శ్రీగంధ మిశ్రితం లింగం పూజయేచ్చ యథావిధి

వింశతి దిన పర్యంతం తాపజ్వర నివారణం

శ్రీ గంధ మిశ్రితమగు మృత్తికచే నొనర్చబడు లింగమును శాస్త్రీయముగా ఇరువది దినములు భక్తిచే పూజించిన తాపజ్వరము పోవును.

శ్లో॥ రక్త చందన సమ్మిశ్రం మహాలింగం ప్రపూజయేత్

ద్వాత్రింశద్దిన పర్యంతం శ్వాసకాస నివారణం

ఎర్ర గంధము మట్టితో కలిపి లింగముచేసి, భక్తి శ్రద్ధలతో ముప్పదిరెండు రోజులు పూజించిన దగ్గు, దమ్ము రోగములు తగ్గును.

శ్లో॥ కస్తూరి సంయుతం లింగం దశరాత్రం ప్రపూజయేత్

కృత్రిమాదీని రోగాది వారయత్యచిరా ధ్రువం

కస్తూరి, మట్టి కలిపి చేసిన లింగమునకు పది దినములు భక్తియుక్తముగా పూజించిన ఆత్మదోషజనిత సర్వరోగములు నివారింపబడును.

శ్లో॥ హరిద్రా మేళనం లింగం శతరాత్రం ప్రపూజయేత్

వశ్యం సురూపం చైశ్వర్యం రాజ్యలాభం భవేద్విజ

మృత్తిక, పసుపు కలిపి నిర్మించిన లింగమును యధావిధిగా వందరోజులు పూజించిన సర్వజనాకర్షణమగును. మంచి రూపము, ఐశ్వర్యము, రాజలాభము కలుగును.

శ్లో॥ శర్కరాన్విత లింగంతు త్రిమాసం పూజయేత్ర్మమాత్

వాక్పటుత్వం సభాస్థానే సుకవిత్వ మవాప్నుయాత్

చక్కెర, మృత్తికలచే లింగముచేసి మూడు మాసములు పూజించిన సభల యందు నేర్పుగా మాట్లడుట, మంచి కవిత్వము చెప్పులు అలవడును.

శ్లో॥ గోఘృతాక్తం మహాలింగం కృత్వా సమ్యక్ప్రపూజయేత్

పంచాశద్దిన పర్యంతం పైత్యరోగ నివారణం

అవునెయ్యి, మన్నుచే చేసిన లింగమును ఏబది రోజులు పూజించిన పైత్యరోగ నివారణ మగును.

శ్లో॥ శాలిపిష్టేన సమ్మిశం లింగం కృత్వా త్రిమాసకం

అర్చయే ద్విధిమర్గేణ సుపుత్రం లభతే ధ్రువమ్.

బియ్యపు పిండితో మేళవించి చేసిన లింగమును మూడుమాసములు నియమానుసారముగా పూజించిన సుపుత్రుని పొందుదురు.

శ్లో॥ తిలైః సంమిశ్రితం లింగం సప్తరాత్రం ప్రపూజయేత్

వైవస్వత కృతాన్దోషాన్ నాశయత్యచిరా ద్విజ

మృత్తిక, నువ్వులు కలిపి సిద్దమొనర్చిన లింగమును ఏడు రోజులు శ్రద్దగా అర్చించిన యమబాధలను నశింప జేయును.

శ్లో॥ అయశ్చూర్ణేన సమ్మిత్రం రాత్రౌ సమ్యక్ప్రపూజయేత్

ద్వావింశద్దిన పర్యంతం శత్రునాశో భవేద్ధ్రువమ్

ఇనుప చూర్ణమును మృత్తిక యందు కలిపి చేసిన లింగమునకు ఇరువదిరెండు దినములు, రాత్రులు యందు క్రమముగా అర్పించిన శత్రునాశన మగును.

శివుడు భూమి రూపమున మద్రాసు ప్రాంతమున గల పంచమహా లింగములలో ఒకటగు ఏకామ్రేశ్వర లింగమై శివకంచి యందు వెలసినాడు. ఈ లింగముపై ఉదకము సమిర్పింపబడదు. ఇది సూర్య, చంద్ర, యాజమాన, భూ, జల, అగ్ని, వాయు, ఆకాశ రూపములతో ప్రపంచమున వ్యాపించిన శివుని అష్టమూర్తులలో నాల్గవది.

షోడశోపచార పూజలో పదవది మరియు, షట్త్రింశత్ తత్వోపరాచములలో ఎనిమిదవదైన భస్మానులేపనము పార్థివ తత్వమే.

షట్చక్రములలో ప్రధమమైన మూలాధారాధిపతి వినాయకుడు. తత్వం పృధివి అందుకేనేమో! మనకు మట్టి వినాయకుని పూజ ముఖ్యం. ఆ తరువాత మరల చెట్ల క్రింద మట్టిలో కలిపేస్తాము. లేదా జలంలో కలిపి పరోక్షంగా క్రింద ఉన్నమట్టిలో కలిసేటట్లు చేస్తాము.

పార్థివ లింగము తయారు చేయునపుడువాడెడి మట్టి ఎవరూ త్రొక్కని చోటు నుండి తీయాలి. ముఖ్యంగా బావులు త్రవ్వేటప్పుడు వచ్చే అడుగున మట్టి చాలా శ్రేష్టం. కుదరని వారు కనీసం, ఒక అడుగు గుంట త్రవ్వి అక్కడి మట్టిని వాడవచ్చు.

ఇవిగాక సాలగ్రామ లింగం, పాషాణలింగం, రత్నమయ లింగం, ఆకాశలింగం వంటి అనేకానేక లింగాలు కలవు.

మరొక విశేషమైనది భుక్తి ముక్తిని ప్రసాదించే నర్మదానది నుండి లభ్యమయ్యే 'బాణలింగం'. సంస్కారానికి ముందు నదినుండి నూతనంగా తీసిన బాణలింగానికి చేసే పరీక్ష విచిత్రంగా ఉంటుంది. ముందుగా లింగాన్ని సమానమైన బరువు గల బియ్యంతో తూచుతారు. మరల రెండవసారి అదే బియ్యంతో అదే లింగాన్ని తూచితే, బియ్యం కంటే లింగం బరువు తక్కువైతే, దాన్ని గృహస్థులు వేదికను నిర్మించి ప్రతిష్ఠించి పూజించుకొనవచ్చును. ఎన్ని మారులు తూచినా తూకం ఒకేవిధంగా ఉంటే, ఆ లింగాన్ని తిరిగి నదిలో పారవేయాలి. ఒకవేళ లింగం బరువెక్కువైతే అట్టి దానిని తటస్థులు, విరక్తులు, సాధు సన్యాసులు అయినవారు పూజించు కొనవచ్చును. తూకంలో హెచ్చు తగ్గులుండుటయే 'బాణలింగం' లక్షణం. ఆవాహన, విసర్జనమూ ఉండని ఈ బాణలింగారాధనను లోగడ ఇంద్రాదిదేవతలు కూడా చేసి యున్నారు. మరిన్ని వివరాలు 'సూతసంహిత'లో కలవు.

ప్రధానంగా ప్రకృతియే 'లింగం'. మహేశ్వరుడు నిర్గుణుడు. ప్రకృతి సగుణం. సగుణమనగా ప్రతివస్తువునందు పరమేశ్వరుని లీలావిగ్రహమును భావించి, పూజించి, తద్వారా అనుగ్రహమును పొందుట.

నిర్గుణోపాసనయన నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాఫలభోగ విరాగము, అరిషడ్వర్గ జయము, శమదమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము కల్గి నిత్యతృప్తుడై, శాంతుడై నిర్గుణత్వోపాసన, ఆంతరంగిక పూజాధ్యానాదులతో శివోహం భావనయా శివైక్యము నొందజూచుటయని చెప్పు కొనవచ్చును. దీనినే పాశుపతియోగము, ఐశ్వర్యయోగమని కూడా అందురు. దీని అనుష్ఠానము నకై సద్గురువుల నాశ్రయించి, చిన్మయదీక్షనొంది షడధ్వశోధన ద్వారా, భస్మరుద్రాక్షషడక్షరీ మహామంత్రముల సేవించుచూ స్థూల సూక్ష్మ కారణ శరీరముల ఇష్ట ప్రాణ భావ లింగముల ధరించి, లింగరూపుడై, భక్త మహేశ్వర ప్రసాది ప్రాణలింగ శరణ ఐక్యస్థలము లనెడి కక్ష్యల నధిరోహించి ఆచార, గురు, శివ, చర, ప్రసాద, మహాలింగములుగా భావించి (ధ్యానించి), దశావధానముల వలన నిరంతర ధ్యాన ధారణ సమాధుల నభ్యసించుచూ దేహ, ప్రాణ, మనోభావముల లింగార్పణ కావింపవలెను. ఈ విధానమే శివాగమములందు పేర్కొనబడినది. అయితే సగుణ ప్రకృతి యొక్క లింగం యొక్క వికాస, విస్తారాల మూలంగా విశ్వసృష్టి జరుగుతుంది. అప్పుడు బ్రహ్మాండమంతా లింగానికి అనురూపంగా ఏర్పడుతుంది. అనంతకోటి సృష్టి అంతయు లింగార్గతమైనదే. లింగమయమైనదే. అట్లే అంతిమంలో, లింగమందు లయమయ్యెడిదే. ఈ భావనకు స్కాందపురాణమే ప్రమాణము.

శ్లో॥ ఆకాశం లింగ మిత్యాహుః పృథివీ తస్య పీఠికా
ఆలయస్సర్వదేవానాం లయనాల్లింగ ముచ్యతే

ఆకాశం లింగము. భూమిదాని పీఠము. అది సమస్త దేవతలకూ ఆలయం. అందు సర్వము లయించును గాన దానికి 'లింగ'మని పేరు గల్గెను. ఆకాశాన్ని లింగం అని పేర్కొనటం నేటి సైన్సు దృష్టిలో బహుమూల్యము. ఈ విషయాన్ని మన పూర్వ ద్వాదశారాధ్యులు, గురువులు, ఋషులు, మునులు చెబితే నమ్మలేము గదా! విశ్వ విఖ్యాత జర్మనీదేశ 'అలవతే అయిన్‌స్టీన్' అనెడి గణితాచార్యానుసారం ఈ విశ్వంలోని గోచరాగోచర వస్తువులన్నియు వక్రమే. విద్యుత్కణాలు, పరమాణువులు, అణువుల మొదలు బ్రహ్మాండం దాకా నున్న సృష్టి అంతా వక్రమే పొడవుగా నున్న రేఖ (లైన్)కు దేనికీ కూడా అస్తిత్వం లేదు. అది వక్రమైన దాని అంశమే అవుతుంది.

వక్రత్వం లింగరూపం. ఈ విశ్వమంతా దేశ కాల వస్తువులనబడే మూడు పదార్థాలతోనే ఏర్పడింది. ఈ మూడూ కూడా లింగరూపంవలె వక్రతాలక్షణం కలవే. ఉపాదానాలు వక్రములైన, వాటినుండి ఉత్పన్నమయే వస్తువులన్నియు వక్రములే అవుతాయి. ఈ విషయంలో ఈనాటి పాశ్చాత్య విజ్ఞాన జగత్తుపైన అధికారం సాగిస్తున్న 'సాపేక్షవాదం' ముందు 'భూమ్యాకర్షణ శక్తి' విలువ దిగదుడుపయింది. వక్రత్వం కారణంగానే వస్తువులు క్రిందబడుతున్నాయి. దొర్లిపోతున్నాయి. వస్తువుల యొక్క పరిమాణం ఏ పిండమందు ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువ వక్రత్వం ఆ పిండమందు పెరిగినదన్నమాట. అట్టి స్థితిలో ఆకర్షణ గూడ అంతే ఎక్కువగా ఉంటుంది. ఆకాశం యొక్క అనంతత్వం (మహాజ్యోతిర్లింగం) ప్రకృతి యొక్క అగ్నిమయాలైన వస్తువుల మహాసమూహం. సారాంశమేమన్న విశ్వాలు అనంతకోటి. అవి అన్నియూ లింగమయాలే. ఈ విశ్వాలకు అతీతంగా యున్న సగుణ పరాత్పర పరబ్రహ్మము యొక్క ఆకారం కూడా లింగమే. కనుక సర్వమూ శర్వమయమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనుట తథ్యం.

సృష్ట్యారంభమున ప్రప్రథమంగా జ్యోతిర్మయ లింగం ఆవిర్భవించింది. నిర్గుణ, నిరాకారమయిన పరమాత్మ, అతనిచే సృష్టింపబడిన ప్రతి పదార్థము (వస్తువు) ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వక్రకారంలోనే వికాసం పొందుతుంది. అమూర్తమూ, అరూపమైన ఆ పరమాత్మకు మూర్తి లేక రూపము ఆవిర్భవించడం అనేది ఈ లింగరూపమందే సంభవమగుతుంది. ఈ లింగం త్రిమూర్తులలోని రుద్రునిది కాదు. ఇది పరాత్పర పర తమ పరబ్రహ్మము యొక్క లింగం. ఈ విషయాన్నే స్వయంగా విష్ణువు ఈ విధంగా రూఢిపరచాడు.

శ్లో॥ స్రష్టాత్వం సర్వజగతాం రక్షితా సర్వదేహినామ్
హర్తా చ సర్వభూతానాం త్వాం వినైవాస్తి కో పరః
అణూనాం మప్యణీయాం స్త్వం మహాంస్త్వం మహతా మపి
అంతర్బహిస్త్వమేవైత జ్జగదాక్రమ్య వర్తసే
నిగమాస్తవ నిశ్వాసా విశ్వం తే శిల్ప వైభవమ్
సత్త్వం త్వదీయ మేవాపి జ్ఞాన మాత్మా తవ ప్రభో

అంతే వివరంగా శివపురాణం, వాయవీయ సంహిత, పూర్వఖండం 6వ అధ్యాయంలో వాయుదేవుడు కూడా శివుని లింగస్వరూపాన్ని ఉపనిషదుక్త పరబ్రహ్మ స్వరూపంగా వర్ణించాడు.

"కోటి జన్మార్జితైః పుణ్యైః శివేభక్తి ప్రజాయతే" కోటి జన్మలయందు చేసికొనిన పుణ్యఫలముచే మాత్రమే మానవునకు శివుని యందు భక్తి కల్గునని త్రేతాయుగమందలి శివగీతా వాక్యము. "అనేక జన్మ సిద్ధానాం శ్రౌతస్మార్తాను వర్తినాం నరాణాం క్షీణ పాపానాం శివేభక్తిః ప్రజాయతే" అనేక జన్మలనుండి ఆచరించిన శ్రౌత స్మార్త కర్మల సిద్ధహస్తుడై, పాప ములు క్షీణించిన మానవునికి మాత్రము శివునియందు భక్తికల్గునని 'క్రియాసారము' చెప్పును.

హైందవ సాహిత్యంలో శివోపాసన ప్రసంగం వచ్చిన ప్రతిచోట అవశ్యము లింగప్రసంగం వచ్చిందనే చెప్పదగును. పైన ఉదాహృతములైన విషయాలకు విరుద్ధంగా ఉన్న కొన్ని శాస్త్రీయరచనలు లేకపోలేదు. శృతి వచనాలలో పరస్పర వైరుధ్యం గోచరించినప్పుడు పూర్వమీమాంస, ఉత్తరమీమాంసాల యుక్తులతో వాటికొక నిర్ణయరూపం కల్గించడం జరుగుతుంది. ధర్మశాస్త్రముపై నిబంధరచన, వ్యాఖ్య, వ్యాసరచనాదులు చేసిన కమలాకరభట్టు, శూలపాణి, వాచస్పతి మిశ్రుడు, రఘునందన భట్టాచార్యుడు వంటి మహానుభావులు మీమాంస పద్ధతిలోనే శాస్త్రీయ వచనాల అర్థములను నిర్ణయించి యున్నారు.

తాత్వికంగా శివుడు పరమాత్మ స్వరూపమే అయినప్పుడు, మరి శివలింగాన్ని ఎందుకు పూజించాలనే ప్రశ్న ఉత్పన్నమౌతుంది.

ద్రోణవధానంతరము అశ్వద్ధామ ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము వ్యర్థము కాగా విచారించు సమయమున వేదవ్యాసుడు వచ్చి,

శ్లో॥ దేవ దేవస్య చింత్యాత్మా అజేయో విష్ణురవ్యయః
సర్వరూప భవం జ్ఞాత్వా లింగేర్చయతి యః ప్రభుం
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభ ధ్వజః

శ్లో॥ జన్మకర్మ తపోయోగాస్త యోస్తివచ పుష్కలాః
తాభ్యాం లింగేర్చితో దేవస్య యార్చాయాం యుగే యుగే

తా ॥ ఓ అశ్వద్ధామా! నీకును కృష్ణార్జునులకును జన్మ, కర్మ, తపస్సు, యోగములన్నియూ సమముగనే గలవు. కానీ వారు ప్రతియుగమునందు, లింగమునందు పరమేశ్వరుని పూజించిరి. నీవు విగ్రహమునందు ధ్యానించి పూజించితివి. అందుచే నీకు వారు అజేయులైరి. వారు పరమ మహేశ్వరులుగాన వారి యందు వృషధ్వజుడైన శివుడు అధిక ప్రీతిని జూపును.

దీనిని బట్టి శివుని (రూపమున) పూజించుట లింగపూజకు గల వ్యత్యాసము తెలియును.

నిర్గుణ, నిరాకారతత్వమై పరమాత్మ తత్వమును తనలో ఇముడ్చుకొని, సాక్షాతూ ఆ పరమాత్మచే పూజింపబడుచూ, పరమాత్మ నుండి ఉత్పన్నమైన ఇతర దేవతా శక్తులందరిచే ఆరాధింపబడుచూ, సృష్టికి అతి పురాతన స్థితియైన కాంతి (జ్యోతి)కి ఉత్పన్నకారణమై, సకల చరాచర జీవరాసులు, గోచరాగోచర శక్తులకు మూలమైన శివ పరమాత్మకు ప్రతీకయైనందులకని (శివుని రూపముకన్న, శివలింగరూపమున జేయు ఆరాధనయే ఉత్తమమని) సమాధానపరచుకొనుటకు మించి గత్యంతరము లేదు.

శ్లో॥ నాస్తి దేహో స్థి రుధిరం నమాంసం నాస్తి కించన
ప్రతిబింబమివా దర్శే శక్రచాప మివాంబరాత్
జ్యోతిర్మయతయా సిద్ధమితం సదాశివం వపుః
తథా వికల్ప నామాత్రం కలావాష్య ధ్వనామిదం

తా॥ నిష్కలమగు శివతత్త్వము శాన్త్య తీతాది పంచకళాత్మకమై షడధ్వాత్మకమగు లింగరూపమున సృష్టి స్థితి లయములకాధారమై ఉపాసించు వారలకు క్రమముగ లింగైక్యమును ప్రసాదింపగలదు.

జ్యోతిర్మయమగు ఈ లింగరూపమునకు దేహముగాని, అస్థి, రుధిర, మాంసాదులు గాని లేవు. అద్దమందలి ప్రతిబింబమువలె, ఆకాశమున కన్పడు ఇంద్ర ధనస్సువలె ప్రకాశించు చుండును.

ఇది ఆది మధ్యాన్తరహితమై, నిష్కళ, నిరంజన నిర్గుణాది శబ్దవాచ్యమును, వాఙ్మనో గోచరాతీతమై జ్యోతిస్వరూపమును బ్రహ్మాండ మండలాకారమునై, ఓంకారము, లింగము, పరిపూర్ణమును, బ్రహ్మస్వరూపమును, నాదబిందు కళాత్మకమునై వెలుంగును.

నాదబిందు సంక్షోభము వలన పరాశక్తి, ఆదిశక్తి ఇచ్ఛా జ్ఞాన శక్తులని పిలువబడును. అనాదియు, నిష్కలము అగుచు పుష్పమందలి పరిమళము వలె, అగ్నియందలి ఉష్ణమువలె అవిభాజ్యమై తనయందిమిడియున్న ప్రకృతి మాయయని పిలువబడు శక్తితో అద్వితీయమై ప్రకాశించును. ఒక్కొక్కసారి భక్తుల ననుగ్రహించుటకై అనేక తత్వములుగ పరిణమించుచు సదాశివ, మహేశ్వర తత్వాదులకు కారణమగును. జటామకుటములదాల్చి, త్రినేత్ర ధారియై, పద్మాసీనుడై లోకానుగ్రహార్థము పంచవింశతి (25) లీలల ధరించుచుండును. మరల నాదము (లింగరూపము), బిందువు (శక్తి) పీఠాత్మకము నాదబిందువుల కలయికచే సృష్టిస్థితిలయములు జరుగుచుండు క్రియయే 'కళ'. ఇది కర్మాత్మకము.

ఏ పరశివ తత్త్వమునుండి సృష్టి స్థితి లయములు జరుగుచున్నవో, అట్టి షడధ్వాత్మమగు లింగరూపమేర్పడుటకు గల కారణము, దాని వైభవము, దీక్షా సంగ్రహణము, లింగధారణ షట్స్థల షల్లింగ సాధనారూపయోగ విధానము పరిపూర్ణమై పరబ్రహ్మ స్వరూపమైన అకార - ఉకార - మకార - అర్ధమాతృకలతో గూడిన పరిపూర్ణ కిరణావరణ స్వరూపమైన ఓంకారాత్మకము (చివరిపేజీ చూడగలరు). అదియే మహాశివరాత్రి యందు బ్రహ్మ - విష్ణువులకు గోచరించిన బిందునాదాత్మక జ్యోతిర్లింగ స్వరూపము.

'శివ ఏవ స్వయం లింగం'యని వాతూలాగమము, 'లింగరూపో మహాదేవః సచ్చిదానంద లక్షణః యని కారణోత్తరము; "లయం గచ్ఛన్తి భూతాని సంహారే లింగమే త్యతః సృష్టికాలే తదా సృష్టి స్తస్మాల్లింగ ముదీర్యతే"యని దీప్తాగమము; "ప్రణవోహి పరం బ్రహ్మ ప్రణవః పరమం పదం, ప్రణవో వాచకస్తస్య లింగరూపస్య ఉచ్యతే"యని లింగపురాణములు తెల్పును. అదే శైవాగమమున "ఓంకారః పరిపూర్ణత్వా జగత్సర్వత్ర వర్తతే, ప్రణవేనైవ మంత్రేణ బోధ్యతే నిష్కలశ్శివః యని గలదు.

నిష్కళమగు ఏ పరశివ తత్త్వముగలదో, అదియే లింగమనియు, సృష్టి స్థితి లయములు దేనినుండి జరుగునో అదియే లింగమనియు, అట్టిది ప్రణవముచే చెప్పబడు పరబ్రహ్మమనియు, పరిపూర్ణమగు ఓంకారము జగత్తు నంతయూ వ్యాపించి యుండునని భావము.

శివుడెప్పుడు అవతరించునో, అప్పుడే శక్తి గూడ ఆతని వెంటనుండి ప్రకాశించును. అమూర్తమైనచో (ఆకారము లేనిచో) ఆకార రహితముగను, సమూర్తమైనచో ఆకార సహితముగను అగ్ని - ఉష్ణత్వముల వలె, శక్తి, శివుని విడనాడకయే యుండును. అట్లే బ్రహ్మరూపము ధరించినపుడు సావిత్రి యనియు, విష్ణురూపమున లక్ష్మియనియు, శివరూపమున ఉమ-గౌరీ-పార్వతి యనియు, సదాశివునకు మనోన్మనీయనియు చేరి యుండును గాన శివుని విడచి శక్తియుండదు. శక్తిని విడచి శివుడుండడు. అందుచే శక్తి రహితమైన లింగము నర్చింపరాదు.

శ్లో॥ లింగే సదాశివః పూజ్యః పిండికాయాం మనోన్మనీం

లింగమునందలి శివుని పిండిక (ప్రాణవట్టము) యందు శక్తిని పూజింపవలయును.

అనాదియై, సనాతనమైన ఈ 'లింగపూజ' అంబామయ (పీఠము), చిన్మయ పరబ్రహ్మ (పురుషుడు) మైనది. బ్రహ్మాండమే శివలింగాకారము. పరిపూర్ణ యోగేశ్వరులు, మహేశ్వరులు, జ్ఞాన స్వరూపులై, భక్తి జ్ఞాన యోగ కర్మాది విద్యలలో మనకు కలియుగంలో మార్గదర్శనం జేసిన మన పూర్వజులను మరువక, త్రిగుణ జగద్బంధముల నుండి గుణాతీతుడై, మంగళకర శివభగవానుని అర్చించి, ఇహ పరముల సుఖములనొందుట 'లింగధారి' విధానము.

"స్వయం తీర్ణ : పరాన్ తారయతి" అనెడి న్యాయమున మనము తరించుచు, ఇతరులను తరింపజేయుచు షణ్మతముల మొదటిదైన శైవమునగల శివలింగ ధారణచే స్వేష్టలింగపూజయందు నిరీక్షణాది శివధ్యాన నిష్ఠాగరిష్ఠులై శివాద్వైత పరాకాష్టచే పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యమును ప్రతి ఆరాధ్యశైవుడైనవాడు పొందవలసియున్నది.



నోట్ : మీ అమూల్య అభిప్రాయం, విమర్శలతో వ్రాసిన ఒక పోస్టుకార్డు, నాకు మున్ముందు వ్రాసే విషయములకు స్ఫూర్తినివ్వగలదు.

స్థూలంగా శివుని గూర్చి, శివలింగమును గూర్చి గల కొన్ని తేడాలను గమనించెదము.

| శివుడు | లింగాకారం |
|---|---|
| 1. మానవాకృతి, శరీర అంగము లన్నియు ఉండును. | 1. నిరాకారుడు. జ్యోతిర్బిందు స్వరూపుడు. |
| 2. సృష్టియందలి వినాశమును నిర్వర్తించు త్రిమూర్తులలో ఒకడు. | 2. సృష్టికి పూర్వుడు. |
| 3. కాలపరిమతి కలదు. | 3. కాలములేదు. ఎల్లప్పుడు ఉండును. |
| 4. సూక్ష్మలోక నివాసి. | 4. పరంధామ నివాసి. |
| 5. కలియుగ వినాశకుడు | 5. సర్వకాలములందు కల్యాణకరుడు. |
| 6. అనేక స్థితులు కల్గినవాడు | 6. ఎల్లప్పుడు ఏకస్థితియే |
| 7. సృష్టి నియమానుసారము పుట్టుచు, గిట్టుచు నుండును. | 7. సృష్టికే మూలము. జరామరణములు లేవు. |
| 8. సాధారణముగా అభిషేకము లుండవు. | 8. నమక, చమక, పురుష సూక్తములతో అభిషేకములనిన ప్రీతి. |
| 9. పురుషతత్వము మెండు. | 9. అర్ధనారీశ్వర తత్వము. |
| 10. కైలాస వాసి. | 10. సర్వాంతర్యామి. |
| 11. బ్రహ్మ-విష్ణువులతో బాటు సృష్టియందు బాధ్యత (లయము) కల్గినవాడు. | 11. బ్రహ్మ - విష్ణాది దేవతలందరిచేత ధరింపబడినది. |
| 12. సగుణము | 12. నిర్గుణము |
| 13. సృష్టికర్త యొక్క రచన. | 13. సాక్షాత్తు సృష్టికర్తయే. |

## శివ - లింగ తారతమ్యము



శివ



లింగం

## రచయిత ఇతర గ్రంథములు
## (రుద్రాక్ష గ్రంథమాల)

- ❖ విభూతి
- ❖ బీజాక్షరములు
- ❖ శివలింగ మహత్యం
- ❖ హిందూయిజంలోని ఆరోగ్య సూత్రాలు
- ❖ ఈమని వీరభద్ర ఖడ్గాలు
- ❖ ప్రారబ్ధం - జన్మరాహిత్యము
- ❖ శివుడెవరు?
- ❖ శైవము - ద్వాదశారాధ్యులు
- ❖ రుద్రాక్ష
- ❖ సంధ్యా వందనము - గాయత్రి

ఇవిగాక అరుపదులకు పైగా శ్రీశైలప్రభ, ఋషిపీఠం వంటి అనేక పత్రికలలో వేదాంత, జ్యోతిష్య, వాస్తు, రత్నాలు, సంఖ్యాశాస్త్ర, ఆధ్యాత్మిక, సాంఘిక, చారిత్రక, పరిశోధాత్మక వ్యాసాలు.